REGD. NO. HNL 18 ESTD 1930 5-4-1991 శుక్రవారం రు. 1.50 లు

# జమీన్‌రైతు

సంపుటి: 62 సంచిక 14 స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు : నెల్లూరు డోలేంద్రప్రసాద్



ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డిపై కక్ష తీర్చుకొనుటకు

# లోక్‌సభ ఎన్నికల్లో వెన్నుపోట్లు?

లోక్‌సభ ఎన్నికలలో పార్టీ అభ్యర్థుల ఓటమిద్వారా ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధనరెడ్డిని రాజకీయంగా దెబ్బతీయడానికి కాంగ్రెస్ నాయకులు కొందరు పెద్ద పథకం రచించినట్లు తెలుస్తున్నది. చెన్నారెడ్డి ఏడాది పాలనలో బ్రష్టుపట్టి ప్రజాభిమానం కోల్పోయిన కాంగ్రెస్ ప్రభుత్వానికి నాలుగంటే నాలుగునెలల వ్యవధిలో జీవంపోసి, అన్నివర్గాలచేత శెభాష్ అనిపించుకొన్న జనార్ధనరెడ్డి పట్ల, ఇటు కాంగ్రెస్‌లోను అటు ప్రతిపక్షాలలోను ఈర్ష్యాద్వేషాలు భగ్గుమంటున్నాయి. జనార్ధనరెడ్డి పెరుగుదలకు వీరో ఒక బ్రేక్ వేయకుంటే వ్యక్తిగతంగా తమకు ప్రమాదమున్న భయం కాంగ్రెస్ నాయకులలో ఏర్పడిపోయింది. అందుకే కాంగ్రెస్‌పార్టీ రాష్ట్రంలోగనుక అధిక లోకసభ సీట్లను కైవసం చేసుకుంటే, ఆ తర్వాత ముఖ్యమంత్రికి పట్టపగ్గాలుండవని వీరు కలవరపోతున్నారు; పార్టీ అభ్యర్థుల ఓటమిద్వారానే తమ అస్తిత్వాలు నిలబడుతాయనేది వీరి అభిప్రాయం.

ఈ కూటమికి నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, నరసింహారెడ్డి, కె. రోశయ్యల త్రయం నాయకత్వం వహిస్తున్నది.

## ప్రతిపక్ష నాయకులతో కలసి కుట్ర పన్నుతున్నారా?

తెలుగుదేశం నాయకుడు శ్రీ వెంకటేశ్వరరావు వీరితో లోపాయికారిగా చేయికలిపినట్లున్నారు. మాజీ ముఖ్యమంత్రి డాక్టర్ మర్రిచెన్నారెడ్డి ఆశీస్సులు వీరికి పరోక్షంగా లభ్యమౌతున్నాయి. మరొక మాజీ మంత్రి శ్రీ జి. వి. సుధాకరరావు నేరుగా వీరితో చేతులు కలుపకపోయినప్పటికి, ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని రెచ్చగొట్టడంద్వారా ముఖ్యమంత్రిని ఇరకాటంలో పెట్టాలని ప్రయత్నిస్తున్నారు. పదవులురాని ఎమ్మెల్యేలు పలువురు వీరందరితో నిత్యం రహస్యమంతనాలాడుతున్నారు.

హఠాత్తుగా తలెత్తిన ఎన్జీవోల సమ్మె బెదిరింపుకూడా ఈకూటమి కుట్రఫలితమేనని గూఢచారి వర్గాల కథనం. సమ్మె తలపెట్టవలసినంత తీవ్ర సమస్యలేవీ ఇప్పుడు ప్రభుత్వోద్యోగులకు లేవు. జనార్ధనరెడ్డి ముఖ్యమంత్రికాగానే, ఎన్టీఆర్ హయాంలోని సమ్మె కాలపు జీతపు సమస్య పరిష్కరించాడు. రాజకీయవాదుల కంటే అయన అధికారులను, ఉద్యోగులకే అధిక ప్రాధాన్యతనిస్తున్నారు. అయినా వారు సమ్మెకు దిగుతున్నారంటే, దీని వెనుక రాజకీయకారణాలు లేవని ఎవరూ విశ్వసించడం లేదు.

ఇవన్నీ ఇలావుంటే పిసిసి అధ్యక్షుడు శ్రీ హనుమంతరావు తనతోవ తనదన్నట్లు వ్యవహరిస్తున్నారు. ఎక్కడ సందు దొరికితే అక్కడ ముఖ్యమంత్రి కాళ్ళుపట్టి క్రిందకు లాగాలన్న ఆతృత ప్రదర్శిస్తున్నారు. అయితే ఈయనకు మాత్రం ఎన్నికల్లో పార్టీ దెబ్బతింటే, తన కాళ్ళ క్రిందకూ నీళ్ళువస్తాయన్న భయంవుంది. ఆ భయంతోనే శ్రీనివాసులురెడ్డి కూటమితో పరోక్షసంబంధాలు పెట్టుకోవడానికి కూడా సాహసించడంలేదు. హనుమంతరావు దృష్టి ఢిల్లీలో జనార్ధనరెడ్డి పరపతి తగ్గించే సంఘటనలపైనే కేంద్రీకృతమౌతున్నది.

ఎవరేదృష్టితో పనిచేస్తే ఏమిగాక. జనార్ధనరెడ్డిని పార్టీలో ఒంటరివాడిని చేయాలన్నదే అందరి ఆశయం. అయితే రాజశేఖరరెడ్డి వంటి నికార్సయిన నాయకుల విశ్వాసం నిల్పుకోగల్గినన్నాళ్ళు జనార్ధనరెడ్డి ఒంటరికావడం జరగదు.

### అగ్రనాయకుల అలక

రాష్ట్రంలోని అగ్రనాయకులు ఒక్కొక్కరు ఒక్కొక్క అలకతో ఎన్నికల రణరంగానికి దూరంగా పారిపోతున్నారు. కురుక్షేత్రంలో భీష్మాచార్యుల వలె నిలబడి కాంగ్రెస్ సేనావాహినిని నడి

—కొరవ 7 వ పేజీలో

## నెల్లూరు ఎలక్షన్లు
### విశ్లేషకుడు

### పార్లమెంట్ అభ్యర్థులు

తెలుగుదేశం, అటు కాంగ్రెస్ రెండింటిలో అభ్యర్థిత్వాలకోసం సంఖ్య పెరుగుతూంది. నెల్లూరు సీటుకు కాంగ్రెస్ టికెట్ కోరేవారి జాబితాకు అంతూపంతూ వుండడంలేదు. అందరిలోనూ అనవరాని ఆశ ముఖ్యమంత్రి మాత్రం చిదానంద స్వామివలె పర్చినవారు దరితోనూ ఓదార్పుగా మాట్లాడుతూ, తన మనసులోని పేరు ...బయటకు పొక్కకుండా జాగ్రత్తపడుతున్నారు. తెలుగుదేశానికి పంజ తింటి పిల్లల డాక్టర్ పెంచలయ్యకే ఖరారయ్యేట్టుంది. ఎన్టీ రామారావు తనను 'పైపందుక్కుండా పైకిలెక్క అడుక్కోండి' అనే నినాదం చేస్తుండడంతో ఆపార్టీలో రక్షలేదు. పాత అభ్యర్థిని శ్రీమతి నాగ భూషణమ్మ, లేక అభ్యర్థి శ్రీ కాకుమాని వెంకురామయ్యల అశపత్తిప్పటికీ, పైనలు లేవనేనుటికి వి వ ర్యా హ వశిపోయినట్లు న్నారు.

ఒంగోలుకు సంబంధించి శ్రీ ...ర సి...రెడ్డిగారు తనకు టిక్కెటే కాదు, గెలుపుకూడా ఖాయమనే రీతిలో, పోలింగ్ తర్వాత చేసి ఢిల్లీ విమానం టికెక్ ఇప్పటికే కొనేసేంత తొందరలో వున్నారు. కాంగ్రెసులోని అనైక్యత ఆయనకేం గాలి మేడలు కట్టిస్తున్నది.

కాంగ్రెసులో రాజమోహన రెడ్డిగారు తన మొండిపట్టు విడవలేదు; తనకు వ్యతిరేకంగావున్న అడుగుడు ఎమ్మెల్యేలలో ఒక్కర్నీ మంచిచేసుకొనే ప్రయత్నం చేయడంలేదు; ముఖ్యమంత్రితో సరసంగా వుండాలనుకోవడంలేదు; సికింగ్ ప్రిన్సిపల్ క్రింద సీటు, రాజీవ్‌గాంధీ పేరుమీద ఓట్లు వస్తు వస్తాయన్నది ఆయన ధైర్యం. మాదాల జానకిరాం, అచ్యుత కుమార్ తిరుపతి నాయుడుగారు మాత్రం కలసిపోదు కోటీశ్వరుడు శ్రీ లసవయ్యకు సీటు ఇప్పించాలని ముఖ్యమంత్రి మెదడు పీకి తూడ్చునిస్తున్నారు. లసవయ్యగారు తన ధన, జన ప్రదర్శనలు అన్నట్లు మొన్నటి ముఖ్యమంత్రి పర్యటనలో 10 వేల మందికి అన్న సంతర్పణ చేసి, చిత్ర కథలు సృష్టించారు.

టిక్కెట్ల ఎంపికకు జనార్థనరెడ్డి 10 తేది తర్వాత ఢిల్లీకి పోతున్నారు 16తేది ప్రాంతంలో అభ్యర్థుల పేర్లు ఖరారు కావచ్చు. అప్పటి వరకు ఎవరి ఊహాలు వారివే.

### జనార్ధనరెడ్డి వర్గానికి మొదటి గెలుపా?

పూర్వం సమితిగా వున్నప్పుడుగాని, తర్వాత మండలం అయిన పిమ్మటగాని బిట్రగుంట నల్లపరెడ్డివారికోటే. శ్రీ గణపతి నాయుండేయనాయుడున్నంత వరకు, అపదవులు ఆయన గడపదాటిపోలేదు కాని ఆయన మరణానంతరం బిట్రగుంట మండల ఉపాధ్యక్షుడు శ్రీ కె. వేణుగోపాలరెడ్డి పీద జనార్థనరెడ్డి వర్గీయులు తెచ్చిన అవిశ్వాసతీర్మానం 30 తేది ఏకగ్రీవంగా ఆమోదింపబడింది 25 మంది సభ్యుల పరిషత్‌లోనూ ఎం.ఎల్.ఎ. శ్రీ వసంతరెడ్డి సమితి... పిటిలయ్య. ఇది ఇక అప్పుడే మొదలు సభ్యులు పెరిగితే కేసి 17 మంది హాజరయ్యారు. అంటే నల్లపరెడ్డి వర్గం గైర్‌హాజరై -చన్నమాట. ఓట్ల మూడు సరిపంచ్ శ్రీ గణపతి సుధాకర్‌నాయుడు తాను సమావేశంలో పాల్గొన్నామనాని. అవిశ్వాసానికి అనుకూలంగా ఓటు చేయలేదంటాడు. వ్యక్తిగతంగా తెల్సుకుపోవడం అనుకూలం క్రిందకురా దావాయుడుగారూ?

గూడూరు తాలూకాలో సంచలనం కలిగించే ఎన్నికలకు సంబంధించి జనార్ధనరెడ్డివర్గం గెలవడం ఇదే మొదటిసార్యాయ మనుకుంటాము. అవును అధికారం చుట్టూ పరిభ్రమించే రోజులివి. జనార్ధనరెడ్డి రాష్ట్ర ప్రభుత్వ అధిపతిగావున్న సమయంలోని ఈ గెలుపు జనార్ధనరెడ్డి ముఖ్యమంత్రిత్వం కంటే, నల్లపరెడ్డివారి అనకాపాద రాజకీయాలమీద కలిగిన అసహ్యమే కారణం కావచ్చు. కారణం ఏదైనా గెలుపు గెలుపే; అభినందనీయమైనదే!

నిజం అప్రియంగా వుండవచ్చుగాని; రాష్ట్రాధిపతి కాగలిగిన జనార్థనరెడ్డి, గూడూరు ప్రాంత ప్రజాధిపతి కాలేకపోవడానికి, ఆయన వర్గీయుల పట్ల జనుల సన్నిహితం కాలేకపోవడమే కారణం కాదా? అధికారదర్పంతో కాకుండా, ఆత్మీయంతో వారి హృదయాలను చూరగొవడానికి ప్రయత్నించదగిన సమయంకాదా ఇది? స్వస్థానంలో జనార్థనరెడ్డి అభేద్యుడు కావాలనేది మా అభిలాష.

### సహకార ఎన్నికలు వాయిదా పడ్డాయి

సహకార సంఘాల ఎన్నికలకు నామినేషన్లు వేసేగడువును 6 నుంచి 10 తేదికి పొడిగించారు. ఈ సహకార, పోలింగ్ వగైరా తేదులన్నీ ఇదే ప్రకారం 4 రోజులు పొడిగించబడరాయి 8 తేది సుప్రీం కోర్టులో ఎన్నికలపై వేసిన పిటిషన్ విచారణకు వస్తున్నందు వల్ల ఈవాయిదా జరిగినట్లుంది.

తెలుగుదేశం తరఫున శ్రీ దేశా నారసింహారెడ్డి, కాంగ్రెస్ పక్షాన శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి, పార్టీ రహితంగా తన మామగారి పక్షాన శ్రీ పోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి ప్రెసిడెంటు అభ్యర్థుల ఎంపికలో ఉంటూవున్నారు తక్కిన వారెవరిలోనూ ఆసక్తి కల్గినట్లులేదు.

### తడ పంట పండింది!

పారిశ్రామికవేత్త శ్రీ పి. ఓబులరెడ్డి వ్యాపారరీత్యా తడలో అడుగుపెట్టిననాటే ఆ గ్రామం పంట పండిందనుకున్నాము. రెండు పెద్దపరిశ్రమలు స్థాపించడంద్వారా ఆయన ఆ ప్రాంత నిరుద్యోగ నివారణకే కాక, ఆర్థికాభివృద్ధికి కూడా దోహదం చేస్తున్నారు. అదికాక ప్రత్యక్షంగా జనులక ప్రయోజనకరమైన కార్యక్రమాలు తడలో ఒకదానికటిగా అమలుజరుపుతున్నారు. ఇరవై లక్షల రూపాయల వ్యయంతో తడ నిపో ఎదురుగా అధునిక సౌకర్యాలతో ఆస్పత్రి నిర్మిస్తున్నారు; అది కొద్దిమాసాలలోనే ప్రారంభం కావచ్చు. వచ్చే విద్యాసంవత్సరంనాటికి జూనియర్ కాలేజి ప్రారంభించగలనని మొన్న తాగ్గానే చేశాడు సూళ్ళూరుపేటలో కాలేజి వుంది; ఏడుమైళ్ళలోవున్న తడలో వరలా మామూలు కాలేజి అవసరం. ఓబులరెడ్డిగారూ! స్వతంత్ర జీవనానికి వుపయోగపడే సాంకేతిక విద్యా సంస్థనుస్థాపించండి; సార్థకంగావుంటుంది.

దానధర్మాల విషయంలో ఓబులరెడ్డి గారి చేతికి క్రమంగా ఎముక లేకుండా పోతున్నట్లుంది. సంతోషదాయకమైన విషయమిది మద్రాసు, తడలతో బాటు నెల్లూరు మీద కూడా క్రీగంటితోనైనా వదాన్యదృక్కులు ప్రసరింపజేయమని ఓబులరెడ్డిగారికి మా విజ్ఞప్తి.

### కరెంటు కోత కడుపు మండిస్తూంది!

రోడ్లపగిలేంత; ఇంటిమీద ఇల్లుగా టౌను పెరిగిపోవడంతో పచ్చటిచెట్లు అదృశ్యమై, విపరీతమైన వుక్కపోత; ఎండనంతటినీ పీల్చుకొని హీటర్లలా మారిపోయి సెగలుగక్కే గోడలు; ఇళ్ళలో, ఆఫీసుల్లో వుండేవారికి ఒళ్లంత

—కారవ 7 వ పేజీలో

# శివారెడ్డి పద్యాలు

### కాంగ్రెసు జయభేరి

కరవు విలయహతుల్ని కాంగ్రెసు జయభేరి
మోగుతుంది పెద్దమోతగుంచి
చూడబట్టి చదువు - దురేం రాసిన
అన్నవోట్లు పడటే చూస్తము కే

తీరగల్లే, తాను తీరాడు చదంట్ల
మందుతీగ చెత్తిపాతిపోద్ది
నీవు గమ్మను ఉ నేనుండి గెలిపిస్తే
తీసకొబ్బి వోట్లు రాతలోస్తే.

### శ్రీనివాసులురెడ్డి

అరిసుండి కరికి ఆపేక్ష చీరంచె
అరపరాని ప్రీతి ఆయోకరోట్లా,
అవజయమ్ము జయము ఆ రెంటికధికారి
ఎగువనున్నవాడు ఏలినోడు!

ప్రాకులాడురాదు పైపైనబడరాదు
పడుగులెత్తురాదు పదవులంటె
ముందువెనుకలేదు, మూన్నాళ్ళముచ్చట్లు,
క్రిందనుండి పైకి అందరంతె!

### ఆచార్య రంగ

రైతుబాంధవుడే రంగాను నిజభూమి
ఇంచుమించు ముప్పై యేళ్ళయింది
వత్రిల్లా మెన్న పైపైన నిజభూమి
గంతులేక తృప్తి కొంతవరకు!

### పెళ్ళకూరు

పలుకరించరాదు పదిమందిలో నన్ను
దెయ్యగలుపరాదు సిగ్గుచేటు
నీకె ఇ పేచ్చ నేనేర. నీవేర
పెళ్ళకూరు! వుండి పెద్దరేవ!

### కోవూరు ఎం. ఆర్. ఓ.

శ్రీపతిరెడ్డి దయాళువు
అపద్బాంధవుడు అయ్యనంటరు వాండే
కోపంలా తాపంలా
పాపరికమెందు కరికి ప్రతిదినమూ!

### భానుమతి

నీకు నాట్యమన్న, నీవన్న నీయావు
రేఖలన్న ఎంతొ ప్రాకులాట
పడుగులెత్తేవాడ్ని ప్రాయంలొ టీవీలో
తిరిగిజూచ నచ్చె కడుపతీర.

# జిల్లావార్తలు

(6 వ పేజీ తరువాయి)

రామరెడ్డి శతజయంత్యుత్సవం వేడుకగా జరిపింది డాక్టర్ జె. జి. వారి గోపాల రెడ్డి అధ్యక్షించారు. రామిరెడ్డి గారు గాంధీజీ ప్రబోధానికిమందే. తనఇంట్లో హరిజనుణ్ని వంటవాడిగా పెట్టుకొని, అస్పృశ్యతా నివారణకు ముందడుగు వేశారని; తాను ప్రాథమిక విద్యమాత్రమే చదివినా, కవిత్రయ జయంతుల పేరిట ఎందరో పండితులను సత్కరించి సాహితీ పోషకుడుగా పేరుపొందారని గోపాలరెడ్డిగారు ప్రశంసించారు.

రెక్టార్ శ్రీ రామచంద్రారెడ్డి, శ్రీ మదుపూరు కోదండరామరెడ్డి, ఇంచార్జి ప్రిన్సిపల్ శ్రీరత్నాజోసఫ్ తదితరులంతా ప్రసంగించారు. డాక్టర్ జె వి సుబ్బారాయుడు కవితారూపంలో సభికులనుస్వాగతించారు; శ్రీ కె వి కోటిలింగం వందనాలు చెల్లించారు.





### కావలిలో కన్నుమూసిన స్వాతంత్ర్య యోధుడు

స్వాతంత్ర్య సమరంలో పన్నెండు సంవత్సరాలు కఠిన కారాగారశిక్ష అనుభవించిన దేశభక్తుడు, గుంటూరు జిల్లా వాసి శ్రీ మానుకొండ వెంకటాచార్యులు (82) 28 తేది కావలిలో, తన స్వగృహంలో శ్రీ ఎస్. వి. భుజంగరాయశర్మ ఇంట కాలధర్మం చెందారు.

వెంకటాచార్యులు ఎంత దేశభక్తుడో అంతటి పండితుడు. సంస్కృత ఆంధ్ర ఆంగ్ల హిందీ భాషలలో ఆయన పాండిత్యం అపారం. ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ స్థాపకులలో ఆయన ఒకరు. జనప పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు వంటివారితో కలిసి పనిచేశారు. మద్రాసు ప్రెసిడెన్సీ. హైదరాబాద్ నిజాం కళాశాలలో సంస్కృత, హిందీ అధ్యాపకుడుగా వుండినారు. ఎన్నో పుస్తకాలు రచించారు. ఇటీవలం ఆరునెలలుగా కావలిలో సాహిత్య, వేదాంతగోష్ఠులు నిర్వహిస్తూ ప్రశాంతంగా కాలం గడుపుతుండినారు. స్నేహితుడికైన గౌరవభావంతో, భుజంగరాయశర్మగారే ఆయనకు దహన సంస్కారాలు నిర్వహించారు. వెంకటాచార్యుల కుమారుడు కర్ణాటకలో ఐ. ఏ ఎస్. అధికారి.

### రాపూరు డిగ్రీ కాలేజి వార్షికోత్సవం

రాపూరు డిగ్రీకాలేజి ఏడవ వార్షికోత్సవం 1 తేది జరిగింది. ఎమ్మెల్యే శ్రీ నువ్వుల వెంకటరత్నంనాయుడు అధ్యక్షించారు. గూడూరు అసిస్టెంట్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ శ్రీ పి. గోపీకృష్ణ ముఖ్య అతిథ్యం నెరపారు. కాలేజి భవన నిర్మాణంలో జరుగుతున్న జాప్యాన్ని నివారించాలని మాజీ సమితి అధ్యక్షుడు శ్రీ పాపకన్న రాజశేఖరరెడ్డి కోరారు; ప్రిన్సిపల్ శ్రీ ఎ వెంకటేశ్వరరావు, కాలేజిలో ఖాళీగావున్న పోస్టులు భర్తీచేయాలని, అనుబంధ హాస్టలు మంజూరు చేయాలని కోరారు. శ్రీ పాపకన్న జయచంద్రారెడ్డి బహుమతులు పంచారు. విద్యార్థిసంఘం అధ్యక్షుడు శ్రీ మేరిగ మురళీధర్ మాట్లాడారు. చివర్న శ్రీ ఎల్. ఆర్. కరెంట్ మ్యాజిక్ ప్రదర్శన, కుమారి స్వర్ణలత సాంస్కృతిక కార్యక్రమం జరిగాయి.

### కోట న్యాయశాఖ సమితి

కోట జ్యుడిషియల్ మేజిస్ట్రేట్ ఆఫ్ ఫస్టుక్లాస్ ఎంప్లాయీస్ అసోసియేషన్‌కు కొత్తకార్యవర్గం ఎన్నికైంది. అధ్యక్షుడుగా శ్రీ వై. దశరథరామరెడ్డి. ఉపాధ్యక్షుడుగా శ్రీ జె వి. రామమోహనరావు, కార్యదర్శిగా శ్రీ కె. నరసింహరావు, సంయుక్త కార్యదర్శిగా శ్రీ బి. ఎం. చంద్రశేఖర్, కోశాధికారిగా శ్రీ ఎస్. వి. ఎల్. ప్రసాద్ నియమితులైనారు.

### విద్యుత్‌శాఖ దీర్ఘనిద్ర- సిద్దనకొండూరు చీకటికథ

కలిగిరి మండలం సిద్దనకొండూరు గ్రామంలో సరైన విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్ లేక గ్రామస్తులు ఇక్కట్లపాలౌతున్నారు. ఇరవైఐదేళ్ళనాడే గ్రామంలో ట్రాన్స్‌ఫార్మర్ బిగించారట. అప్పటినుండి ఇప్పటివరకు దాని సామర్థ్యం పెంచనేలేదు. ఆ రోజులలో ఏ పదిశాతం ఇళ్ళకో అప్పు కరెంట్ వుండేదికాదు వ్యవసాయ మోటార్లు తక్కువే ఇప్పుడా రెండూ కొన్నివందలరెట్లు పెరిగాయి. కాని ట్రాన్స్‌ఫార్మర్ మాత్రం అదే! పెరిగిన లోడ్‌కు తగినట్లు లేకపోవడంతో లోవోల్టేజి కరెంట్ సరఫరాఅయి, మోటార్లుకాలిపోతున్నాయి; బల్బులు మాడిపోతున్నాయి. ట్యూబ్‌లైట్లు అసలు వెలగడంలేదు. ట్రాన్స్‌ఫార్మర్ మెయింటైనెన్సు ఇన్సులేషన్ పూడిపోయి స్తంభాలకు ఎర్త్ అవుతున్నచోట ఎవరైనా పిల్లలు పొరపాటున స్తంభానికి చేయితాకిస్తే షాక్‌కొట్టి పడిపోతున్నారు. సంబంధిత అధికారులకు ఎన్నిసార్లు విన్నవించినా పట్టించుకోవడమే లేదట.

కావలి డి ఇ గారికి చెప్పిచూశారా ★



నెల్లూరులో సర్టిఫైడ్ ఖద్దరు ప్రచార రౌపాల్ వీరాస్వామి కుమార్తె పంద్మ (బి ఎస్‌సి); నెల్లూరు ఎ పి ఎస్ ఇ బి అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు రావి సురేష్‌బాబు బి. ఇ — వీరి వివాహం మార్చి 22 తేది నెల్లూరులో జరిగింది

### పినాకినీతీరం

(2 వ పేజీ తరువాయి)

ప్రారంభోత్సవ సభలో మహోపన్యాసం చేసిన ఎన్ సి వరసింహారెడ్డిని నరసింహావతారంగా పోల్చడం అన్యాయం అనిపిస్తుంది. ఆయన అతి వికృతంగా భయంకరంగా వుంటాడా? పొట్టలు చీల్చి ప్రేగులు బయటకుతీసేంత క్రూరంగా ప్రవర్తిస్తాడా? అంతరంగికంగా ఏ అవతారమో గాని, బయటకుమాత్రం నాజూకునవ్వుతో నవనాగరికపు వర్తనతో చిరునగవుతో చిద్విలాసంగానే వుంటాడు నారసింహారెడ్డి. ఇరకా ఎన్ సి. దృష్టిలో ఈ నరసింహమూర్తి చీల్చబోయే హిరణ్యకశిపుడెవడు? తెలుగుదేశం అభ్యర్థే హిరణ్యకశిపుడు కావలసివస్తే అప్పుడు ముందుగా అన్నమాటను వెనక్కు తీసుకునేదెట్లా? ఒకడు రాక్షసుడుకాదు, ఇంకొకడు దేవతలూకాదు-అందరూ మానవమాత్రులే!

NSR

## సందోహం

### ముహూర్తములు

6 తేది శనివారము ఉదయం 7.40 గంటలకు మేషలగ్నమున వ్యాపారారంభ. వివాహములకు. 10 తేది బుధవారం ఉదయం 7.22 గంటలకు మేషలగ్నమున వ్యాపారారంభ వివాహములకు, ఉదయం 8.50 గంటలకు వృషభలగ్నమున గృహారంభ వివాహములకు. సుముహూర్తములు.

### ఏప్రెల్ తిథులు

చైత్రబహుళ

| | | |
|---|---|---|
| 6 శని | సప్తమి | రా. 8.50 గం వ |
| 7 ఆది | అష్టమి | ,, 10.53 ,, |
| 8 సోమ | నవమి | ,, 12.40 ,, |
| 9 మంగళ | దశమి | ,, 2.00 ,, |
| 10 బుధ | ఏకాదశి | ,, 2.55 ,, |
| 11 గురు | ద్వాదశి | ,, 3.20 ,, |
| 12 శుక్ర | త్రయోదశి | ,, 3.15 ,, |

-స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఎ.



పుణ్యమూర్తి అయిన మా ప్రియతమ జనకుడు

## పురిణి వెంకటరమణయ్యగారు

29-3-91 తేది శుక్రవారం

స్వర్గస్థులైనారు

### వారి ఉత్తరక్రియలు

**19-4-91** శుక్రవారం శిలాప్రతిష్ఠ-**20-4-91** శిలోద్వాసన
పురిణిలో మా స్వగృహమున జరుగును,
బంధుమిత్రులు తెలియగోరుతాము.

పి. శ్రీనివాసులు ... డాక్టర్ పి. చంద్రశేఖరయ్య ... పి. కోదండరామయ్య



Edited. Printed & Published by N. Dolendra Prased at the Zamin Ryot Press, - Nellore